ఓం.

శ్రీ గురు మల్లికార్జున ప్రసన్నము

జన్మలింగధారణ· శివపూజా· పాదపూజా· దీక్షా

వివాహ·

ఈ విధులు నున్న

# వీరశైవాచార పంచరత్నం.

ఈ అపూర్వ గ్రంథము

హాంపసహాళి ప్రసిద్ధ పంచాంగకర్తలైన


పండిత టి· హెచ్· ఎం బిహ్మశ్రీ సిద్ధాంతి

హెబాళై బసవ శాస్త్రులు


వలన రచియింపబడి,

కర్నూలు ప్రసిద్ధ శ్రీమంతులైన

సజ్జన గంగప్ప గారి

ధన సహాయమువల్ల


కర్నూలు శాయిలక్ష్మీ ముద్రాక్షర శాలయందు ముద్రింపబడినది.

1939.




[వెల 0—4—0

ప్రసిద్ధ శ్రీమంత్ శ్రీమాన్ సజ్జన గంగప్పగారు.

ఈ మహనీయులు మద్రాసు యిలాకా కర్నూలు పట్టణ నివాసులు. వీరు వీరశైవ మతజ్ఞులు మంచి ఆచారశీలురు. శివపూజా నిష్ఠులుగానుండి చాలాధర్మ కార్యములు చేసి కీర్తిని పొందియున్నారు. మరియు శ్రీశైల భక్తమండలి వీరశైవ మహాజన సంఘమునకు ధన సహాయము చేసి నిండా అభివృద్ధికి తెచ్చియున్నారు. ప్రతి సంవత్సరం శ్రావణ-ఆశ్వీజ మాసములలో పురాణ శ్రవణ శివకథా శ్రవణము మొదలయిన దేవతోత్సవ - అన్నదాన - ధర్మకార్యములను చేయు చున్నారు. వీరు పెద్దకుటుంబము ఏవిధమైన భిన్న భేదము లేక ఐక్యముతో కాపాడు కొని వచ్చుచున్నారు. వారు యిప్పటి పరిస్థితిలో అధిక హీనస్థితి యందున్న వీరశైవాచార ధర్మములును అభివృద్ధి స్థితికి తే వలెనని ఈ వీరశైవాచార పంచరత్న గ్రంథమును ప్రింటు చేయించి ఈ గ్రంథమునుండి వచ్చే ఆదాయమును ఈ శాస్త్రిగారు స్థాపనము చేసి శ్రీ పంచమ జార్జు చక్రవర్తి స్మారక జో తిష వైదిక పాఠశాలకు వుపయోగించవలయునని ఏర్పాటు చేసి అన్నదాన, విద్యాదాన ఫలమునకు పాత్రులై కీర్తిని పొందినారు ఈ స్మారక పాఠశాలకు సహాయము చేసిన వీరి వినయమును శ్రీ షష్టమ జార్జు చక్రవర్తులకు వైస్‌రాయి ప్రభువులకు మద్రాసులోయుండే గౌర్నరులకు ఎరుకె చేసుకొనుచున్నాము. యీ మహాశయుల కీర్తియు ప్రపంచమంతయు ప్రఖ్యాతిలై ఆ అచంద్ర తారార్క పర్యంతరం స్థిరము గా నిలిచి పోయినది. వీరికుటుంబ మునకు శ్రీ పరమాత్ముడు ఆయు రారోగ్య ఐశ్వర్యము నిచ్చి కాపాడ వలెనని వేడుచున్నాము.





శివ పూజా విధి క్రమము.

పవిత్రమైన వీరశైవ లింగధారులైన స్త్రీ పురుషులు ప్రతిదినము స్నానము చేసుకొని తమ ఇష్టలింగమును శాస్త్రవిధి ప్రకారముగా పూజించవలయును

## అభిషేకము

అభిషేకమంత్రము,

హరిః ఓం। సద్యోజాతం। ప్రపద్యామి సద్యోజాతాయవై నమోనమః। భవే భవేనాతి భవేభవస్వమాం భవోద్భవాయనమః। వామదేవాయనమః। జ్యేష్ఠాయ నమః। శ్రేష్ఠాయనమః। రుద్రాయనమః। కాలాయనమః కలవికరణాయనమః బలాయనమః। బలవికరణాయనమః। బలప్రమథాయనమః। సర్వభూతదమనాయన, మోమనోన్మనాయనమః। అఘోరేభ్యోథఘోరేభ్యో ఘోరఘోరతరేభ్యః। సర్వతస్సర్వేభ్యః నమస్తే అస్తురుద్రరూపేభ్యః। తత్పురుషాయ విద్మహే మహాదేవాయధీమహీ తన్నోరుద్రః ప్రచోదయాత్ ॥ ఈశానః సర్వవిద్యానామీశ్వరస్సర్వభూతానాం బ్రహ్మాధిపతి బ్రహ్మణోధిపతిర్బ్రహ్మశివోమే అస్తుసదాశివోం శాంతి శ్శాంతిరస్తు.

ఈ మంత్రమును చెప్పుచు లింగమునకు అభిషేకము చేసుకొని భస్మము ధరించవలెను.

## భస్మధారణ మంత్రం.

విభూతి ర్భూషణంచైవ విధికర్మ వినాశనం। యమర్లోకభయంనాస్తి శివర్లోక॥ మహీయతే। అనాది శాశ్వతం శాంతం చైతన్యంచిత్స్వరూపకం। చిద్భస్మ వృషభాకారం చిద్భస్మం లింగధారణం ॥ ఇతిమంత్రేణ భస్మధారణం కరోమి ॥ ఈ మంత్రముచెప్పి లింగమునకు భస్మము ధరించవలెను.

## గంధ ధారణ మంత్రం...

పరమానంద సౌరభ్యం పరిపూర్ణ దిగంతరం। గృహాణ పరమంగంధం కృపయా పరమేశ్వర ॥ శ్రీసాంబ సదాశివాయనమః। ఇతిగంధం సమర్పయామి॥ ఈ మం గంధం ధరించవలెను.

### అక్షత ధారణ మంత్రం.

అక్షతాః ధవళాః దేవం తాపసోత్తమ పూజితం। ధారయేన్మూల మంత్రేణ లింగమూర్ధ్ని సమాహితః ॥ ఈ మంత్రముతో అక్షతప ధరించవలెను.

### బిల్వపత్రధారణ మంత్రం.

త్రిదళం త్రిగుణాకారం త్రినేత్రంచ త్రియాయుధం। త్రిజన్మ పాప సంహారమేక బిల్వం శివార్పణం। ఈ మంత్రముతో బిల్వపత్రిలను ధరించవలెను.

### ధూప మంత్రం.

వనస్పతి రసోత్పేతో గంధాఢ్యో ధూపముత్తమః। ఆఘ్రేయ సర్వదేవానాం ధూపోయం ప్రతిగృహ్యతాం। శ్రీ సాంబసదా శివాయనమః। ఇతిమంత్రేణ ధూపం సమర్పయామి ॥ ఈ మంత్రముతో ధూపమును అర్పించవలెను.

### దీప మంత్రం

సాజ్యంత్రివర్తి సంయుక్తం వహ్నినా యోజితంప్రియం। భక్త్యాదీశం ప్రియచ్ఛేశ దేవాయ పరమాత్మనేః శ్రీ సాంబసదాశివాయనమః। ఇంతిమంత్రేణదీపం దర్శయామి ॥ ఈ మంత్రముతో దీపమును వెలిగించవలెను.

### కర్పూర మంత్రం.

కర్పూరగౌరం కరుణావతారం సంసారసారం భుజగేంద్రహారం। సదావసంతం హృదయారవిందే భవం భవానీసహితం నమామి॥ శ్రీ సాంబసదా శివాయనమః। ఇతిమంత్రేణ కర్పూరదీపం నీరాజయామి ॥ ఈ మంత్రముతో కర్పూరం వెలగించవలెను.

### నైవేద్య మంత్రం.

ద్రాక్షా ఖర్జూర సంయుక్తం నారికేళ ఫలాన్వితం। మధు శర్కరయాయుక్తం నైవేద్యంచ ప్రకల్పయేత్॥ శ్రీ, సాంబసదా శివాయనమః ॥ ఇతిమంత్రేణ నైవేద్యం సమర్పయామి ॥ ఈమంత్రముతో నైవేద్యమును అర్పించవలెను.

### తాంబూల మంత్రం.

క్రముకంచ శిలాచూర్ణం నాగవల్లి దళైర్యుతం। జాతీ లవంగసం యుక్తం తాంబూలంచ సమర్పయేత్। శ్రీ సాంబ సదాశివాయనమః। ఇతిమంత్రేణ తాంబూలం సమర్పయామి ॥ ఈమంత్రముతో తాంబూలము సర్పించవలెను.

## పుష్పాంజలి మంత్రం.

మంగారకుండ హాటిచందన పారిజాతై నక్షత్రపుండ నిశ ధ్వనిగీతనృత్యైః నానా విధాన కరవైరభిపంచ మూలై పుష్పాంజలి పతిపత్యేర్పయామిః। ఈమంత్రముతో బిల్వపత్రమును తీసుకొని లింగంమీదవేసి పుష్పాంజలిని చేయవలెను.

## నమస్కారమంత్రం.

నమః శివాయ శాంతాయనమః। సోమాయ శంభవేనమః। నమః శివాయ కల్యాణి పతయే నమోనమః। నమః శివాయ భీమాయ రుద్రాణీ పతయేనమః। నమః శివాయ రుద్రాయ శంకరాయ నమోనమః॥ ఈ మంత్రములను చెప్పి ఇష్ట లింగమునకు నమస్కారము చేయవలెను.

## స్తోత్ర మంత్రం.

హరశంభో మహాదేవ విరూపాక్ష త్రిలోచన। దయాసింధో దీనబంధో రక్ష రక్ష మహేశ్వర॥ మాయాసముద్ర పతితం అనంత కలుషావృతం। మాముద్ధృత్య మహేశాన భక్తవత్సల శంకర॥ లింగపూజ అయిన తరువాత ఈ స్తోత్రమును చెప్పి లింగపూజను ముగించవలెను.

## పాదపూజావిధిక్రమం

ప్రతియొక వీరశైవుడు ప్రతిదినం పై చెప్పినప్రకారము శ్రీలింగ పూజచేసుకొని తన ఇంటికి ప్రతిదినముగాని ప్రతిసోమవారముగాని ఆచారశీలులైన జంగమమూర్తిని పిలుచుకొనివచ్చి తమయొక్క శివ పూజాగృహమునందు ఉత్తరాభిముఖముగాని అథవా పూర్వాభిము ఖముగాని వేసిన గురుగద్దిగెమీద కూర్చుండ బెట్టవలెను. తరువాత ఆగురువు యొక్క పాదములను ఒకపాత్రలో కడిగి చక్కగాద్రవము తీసి పాదప్రక్షాళననీటిని ఆ గృహముయొక్క అన్నిప్రదేశములకు సం ప్రోక్షించి తదనంతరము గురువుకు సాష్టాంగనమస్కారముచేసి గురువు యొక్క కుడిభాగములో నొకపాత్రలోశుద్ధమైననీరు విభూతి బిల్వపత్ర పుష్పగంధఅక్షతాధూప నైవేద్యతాంబూలము మొదలైనపూజాపదా ర్థములను పెట్టుకొని అనంతరము యొకచిన్న పాత్రయందు నీళ్ళనువేసి దానిలో భస్మమునుంచి ఓం అనుఅక్షరమువ్రాసి పూజచేసి ఆ పా త్రను గురువుయొక్క రెండు పాదాంగుష్టముల క్రింద పెట్టి తనకుడి చేతి ఐదువ్రేళ్ళనుంచి పాత్రలోనున్న ఉదకమును రెండు పాదాంగుష్టము

లవరకు ఐదుసార్లు అర్పింపవలెను. తదనంతరం ఆ పాత్రను ప్రత్యేకముగాపెట్టి గురువుయొక్క ఇష్టలింగమును పూజచేసితదనంతరము గురు పాదపూజచేయవలయును. పాదపూజచేయుక్రమము:- తనయొక్క వామ (ఎడమ) హస్తముతో పాశారపరిణవాక్షరముచు వ్రాసి గురువు యొక్క రెండుపాదములను తన వామహస్తముమీద పెట్టుకొని [మంత్రి].శ్లోక॥ ఓంకారాది యకారాంత ద్వాదశాక్షర సంయుతం అ, ఉ, మ, అక్షరత్రియం వై బసవై శ్యాక్షరాన్వితం॥ రేఖాగర్భే కృతం జాప్యం గ్రహ సంఖ్యంవరాననే॥ అనేశాస్త్రవచనాను సారముగా గురువు యొక్క కుడిపాద 5 వ్రేళ్ళమీదను వామపాద5 వ్రేళ్ళమీదను న మ శ్శి వా య ఈ పంచాక్షరములను వ్రాసి పాదాంగుష్టములమధ్యమందు (ఓం-బసవా) అనివ్రాసి పాద పూజను చేసి నైవేద్యమును అర్పించి నమస్కారముజేసి పత్రి పుష్పాదులను తీసివేసితదనంతరము క్రియాపాత్రలో ఓం నమశ్శివాయ ఈ షడక్షరమంత్రిమును. వ్రాసి ప్రక్కన వేరుగానుంచుకొన్న చేతిపాత్రలో తీసుకొని కుడి పాదాంగుష్టముమీద ఆరుసార్లు షడక్షరమంత్రముతో పాదోదకమును ప్రోక్షించి తదనంతరము, వామ పాదాంగుష్టముమీద 5సార్లు పంచాక్షర మంత్రముతోను పాదాంగుష్టమధ్యమందు మూడుసార్లుబసవమంత్రిము తోను పాదోదకమును ప్రోక్షించిఉదకద్రవమునుచక్కగాతీసిభస్మమునుధరించి యొకబిల్వముధరించి ధూపమును వేసి నమస్కారముజేసి, క్రియాపాదోదకవస్త్రిములను రెండుహస్తములనుంచి(మూసు)కొనవలసినది.గురువు మంత్రిమును చెప్పుచు తనయొక్క 5 వ్రేళ్ళనుంచి క్రియాపాదోదకమును తన ఇష్టలింగముమీధ వేసిపావ ధానముతో స్వీకరించవలెను. అనంతరము "శిష్యుడు హరహర కాలహర కర్మహరదురితహరహర మహాప్రసాద పూర్వజన్మకర్మనివారణ- దీక్షాగురు-మోక్షాగురు గురోర్గురు పరమగురు పరమారాధ్య శ్రీమహాస్వామి,ప్రసీద భవత్పాదపద్మయోః సాష్టాంగ ప్రణామంకరోమి। దేహిపాద తీర్థస్వీకారమనుజ్ఞాం॥ అనిచెప్పి నమస్కారము చేసి పాదతీర్థమును తీసుకొనవలెను అనంతరము ఇంటివారందరు ఇదేప్రకారముగా సాష్టాంగ నమస్కారముచేసి పాదోదకమును తీసుకొనవలసినది పాదతీర్థము తీసుకొనినతరువాత ఏపదార్థములను ముట్టక తమ ఇష్టలింగమునకు భస్మము ధరించుకొని గురువర్యులకు నమస్కారము చేసి జన్మమును పావనము చేసుకొనవలెను.

# వీరశైవ వివాహ విధిక్రమము

వివాహమును చేయు యింటియందు ఒక్క యోగ్యమైన స్థలములో అందమైన మంటపమును కట్టించి ఆ మంటపములో ఆవుపేడ గోరోజనము గోమూత్రమునుకూడ చేర్చి అలకవలెను. మంటపపైభాగములో కొత్తదుకూలము వేయించి తదనంతరము వివాహమంటపములో గురువుపూర్వ ముఖముగా కూర్చొను రీతిగా గద్దుగె వేసి దానిమీద కొత్తవస్త్రము వేయవలెను గద్దుగె ముందుభాగమున బియ్యము వేసి దానిమీద పంచకలశములను స్థాపించి. కుడిభాగముతట్టు శ్రీ నిరంజన గాంగేయ కలశమును స్థాపింపవలెను. ఈ ప్రకారము షట్కలశములను స్థాపించి, తరువాత ఆ కలశములను నూలుదారముతో తొమ్మిది పోగులతో చుట్టవలెను. ఆ కలశములకు తమలపాకుల చేత అలంకరించి గురుగద్దుగె తట్టుఒక సూత్రమును, వధూవరులు కూర్చొను తట్టు ఒక సూత్రమును వేయవలెను ఈ రెండు సూత్రముల తుదకు దర్భ పుంగరములను కట్టవలెను. తరువాత ఆ కలశములో శుద్ధోదకము వేసి ఆ కలశములను పూజచేసి కలశములమీద మడిపత్రము వేయవలెను. ఈ ప్రకారము కలశములను స్థాపించి 10 కొబ్బర బట్లలో ఒక్క పసుపు కొమ్ము నిమ్మపండు దక్షిణము వేసి కొత్తవస్త్రములో పది పండ్లను. కట్టిపెట్టవలెను. తరువాత కలశముల ముంభాగములో ఒకకంబళిని వేసి దానిమీద బియ్యము వేసి వధూవరులను కూర్చుండబెట్టవలెను తదనంతరము ముంభాగములోనున్న సూత్రమును వధూవరుల హస్తవేళ్ళకు చుట్టి హస్తపూజచేయవలెను.

## దశకర్మ పద్ధతులు.

---

### కంకణ ధారణ క్రమము.

రెండు మూడు కొమ్ములున్న పసుపునుతీసుకొని దానిని కలశములకు వేసిన దారమునుండి కంకణమును చేసి, పూజించి సర్వకాలే మహానాథ భక్తిరస్తు క్రతౌమమ తస్మాత్ బధ్వాకంకణశ్చ నిశ్చయం శివసాక్షితః । కాశ్మీరే వసతే కన్యాలంకాయాం వసతే వరః। అకట్లో వికటశ్చైవ గురుర్బ్రహ్మా చ కంకణం। ఈ మంత్రముతో వధూవరుల హస్తములకు కంకణధారణము చేయవలెను.

2 సుదర్శన మంత్ర క్రమము.

సమ్మేనోత్తా భితాభూమి। సూర్యేణోత్తాం సూభితాద్యా। ఋత్వేనాదిత్యాస్తిష్ఠం తి। దివిసోమో అదిశ్రితః॥ ఇతిమంత్రేణ వధూవరకయోః సుదర్శనకం పరస్పరశిరసి సంప్రోక్షయేత్॥ ఈమంత్రముతో వధూవరుల హస్తములలో జిలకర బెల్లముచేసి ఉభయుల తలమీద వేయించవలయును.

—♦ కన్యాదానము చేసేక్రమము ♦—

కన్యాదానమును చేసే అత్తమామలు ఇరువురు ఒక కలశములో శుద్ధోదకము బిల్వపత్ర గరిక పచ్చి అక్షతలను వేసి ఇరువురు పట్టుకొని క్రింద యొక పాత్రను పెట్టి వరుని యొక్క కుడిహస్తము మీద వధువుయొక్క రెండు హస్తములను పెట్టించి అత్తమామల ఇరువుల నోటినుంచి

శ్లో॥ కన్యాం కనక సంపన్నాం। సర్వాభరణ భూషితాం॥ దాస్యామి శంభ వే తుభ్యం। శివలోక జిగీషయా। దేవదేవభక్తగ్రణోర్మధ్యే అశేష జనసమ్మతః, స్వపుత్రీం దీయతే త్వం॥ దారాదత్తస్తు నిశ్చయం। మమవామ పార్శ్వే తిష్ఠతాం: మమదక్షిణ పార్శ్వే తిష్ఠతాం అతితాయే వరాయే సువర్ణపూర్వక దక్షిణపూర్వక జలధార పూర్వకసకుంకుమ బిల్వదళ సాక్షేణ కన్యాదానం కరిష్యే॥ ఈసంకల్పము నుచెప్పి ధారగాపోయవలెను. ఇమాం కన్యాంప్రతిగృహ్ణామి ఈప్రకారము వరునిలో చెప్పించవలెను.

4 మాంగల్యధారణక్రమం.

మాంగల్య తంతునానేన మమజీవన హేతునా। కంఠే బధ్నామి శుభగేత్వం జీవ శరదశ్శతం। యదాబధ్నేం దాక్షాయణీ హిరణ్యం శతేదేవేషు కృణ తేదీర్ఘాయుః మాంగల్యమంత్రమును ముత్తైదుస్త్రీలతో ముట్టించి ఈమంత్రములో వరునిచేతనుంచి వధువుయొక్క కంఠమునకు ధరించవలెను.

4. ఆజ్యక్షీర క్రమం.

శక్త్యా స్వస్త్రీయ మాణోపిక్షీరాజ్య స్పర్శనం భవేత్। పాత్రే క్షీరాజ్య సంయుక్తం మాక్తికాన్వేషణం చరేత్॥ దాక్షిణ్యా స్సర్వదేవాశ్చ తరగుల్మలతాదయః పశుపక్షిమృగాద్యశ్చ సాక్షిసాక్షిప్రమాణయోః। తవసంరక్షణార్థంచ తవమానసపాలనే। క్షీర శర్కర హస్తంచ దాక్షిణ్యాం పాలయామ్యహం। తవభక్తిమహా శ్రద్ధాశివ పూజాపరాయణే। తవధ్యానాను రక్తాహం నిశ్చయం కృణనిశ్చయం॥ ఒక పాత్రలో ఆవుపాలు నేయిపోసి మూడుసార్లు వధూవరుల హస్తములను ఈ మంత్రముతో అద్దించవలెను. అనంతరం ఆ పాలు నేయితో ముద్దచేసి మూడు సార్లు వధూవరులతో ఆముద్దను రుద్దించవలెను.

## 5 పాదసంఘట్టన క్రమం

ఏక పదీచ-ద్విపదీ-త్రిపదీచ-చతుష్పదీ వధూవరా పంచపదీ-పాదోద్ధాపనామాచరేత్॥ ఈమంత్రములో పెండ్లి కుమారుని పాదాంగుష్ఠములనుండి పెండ్లికుమార్తె యొక్క అంగుష్ఠమునకుముట్టించవలెను పెండ్లికుమార్తెతో పెండ్లికుమారునికి నమస్కారముచేయించవలెను.

## 6 అక్షతారోపణ క్రమం

తదేవ లగ్నం సుదినంతు దేవా తారాబలం చంద్రబలంతు దేవా విద్యాబలంతు దైవబలం తు దేవ గౌరీప తే తేంఘ్రియుగళం స్మరామి సుముహూర్తాస్సావధానాం సులగ్న స్సావధానాం॥ పార్వతీ పరమేశ్వర ధ్యానోత్సవ స్సావధానాం॥ ఒక పాత్రలో బియ్యము పసుపు ఆవు పాలు నేయి వేసి కలిపి పెండ్లి కుమారుని హస్తమునుంచి మూడుసార్లు పెండ్లికుమార్తెయొక్క మస్తకముమీద వేయించవలెను. అనంతరము పెండ్లికుమార్తెయొక్క హస్తమునుండి పెండ్లికుమారునియొక్క మస్తకముమీద మూడుసార్లు వేయించవలెను.

## 7 నాశికా భూషణ క్రమం

మంత్రం:— మహేశ్వరీ మహాదేవీ శారదా భువనేశ్వరీ। ఇదం సర్వమాయుః శాంతిస్తుష్టి శ్చాపుష్టిశ్చాస్తు। ఇతి మంత్రేణనాశికాభరణం ధారయేత్॥

ఈ మంత్రముతో పెండ్లి కుమార్తెయొక్క నాశికమునకు ముక్కెమును పెట్టించవలెను.

## 8 ఫలదానము పెట్టించు క్రమం

మంత్రం:— ఫలం మనోరథ ఫలం ప్రదదాతి సదాన్నృణాం।
పుత్రపౌత్రాభివృద్ధ్యర్థం అథ శాంతిం ప్రయచ్ఛమే। హిరణ్య గర్భగర్భ స్థం హేమబీజంవిభావసోః అనంతపుణ్యఫలద మతశ్శాంతింప్రయచ్ఛమే॥

ఈ మంత్రముతో వధూవరులచేతినుండి మాహేశ్వరులకు బొంకాయ దక్షిణమును దానము యిప్పించవలెను. అనంతరము పెండ్లి

కుమారుని చేతినుండి పెండ్లి కుమార్తెయొక్క వడిలో బెంకాయినుంచవలెను.

మహేశ్వరులు ఆశీర్వాదం చేయుమంత్రం

మంత్రం:— శ్రియాం వర్ధస్వ మాయుష్యమారోగ్యం మాయుధాత్శోభాయమానం। మహాధనధాన్యం పశుబహుపుత్రలాభం శతసంవత్సర దీర్ఘమాయుః॥

ఈ మంత్రములో వధూవరులను ఆశీర్వాదం చేయవలెను.

9 ధాతుబద్ధ కర్మం

మంత్రం:— హరిద్ర శృంగపూగంచ గుండజీరకపంచధా। వధూవరా బరాగేణ బద్ధాశీర్వాద పూర్వకం। ధృవంతేనంది కేశా యోగణాధిపా ధృవంతే సాంబికేశాన్ మంగలం ధారయేద్ధృవం॥

ఈ మంత్రముతో ఒక్క పసుపు బంగారుముక్క బెల్లము వీలకర వీటిని వస్త్రముకొంగుకు ముడి(గంటు)గట్టవలెను.

10 అరుంధతీ దర్శన క్రమం

మంత్రం:— పతివ్రతాలక్షణ లక్షితాంగీ సన్మార్గగామీ శుభసౌఖ్యదాయీ। అరుంధతీనామ వసిష్ఠపత్నీ వధూవరాభ్యాంవరదా భవంతు। శివస్యపత్నీగిరి రాజపుత్రీ వధూవరాభ్యాం వరదాభవంతు। రామస్యపత్నీ జనకస్యపుత్రీ వధూవరాభ్యాం వరదాభవంతు।

ఒక తట్టలో బియ్యము వేసి మధ్యమునందు ముత్తు మౌక్తికమును పెట్టి ఈమంత్రముతో దంపతులుంచి మౌక్తికములను దర్శనము చేయించవలెను. ఈ ప్రకారముగా దశకర్మములనుచేసి పిమ్మట వధూవరులనులేపి దేవతాగృహమునకు పిలుచుకొని పోవలెను.

ఇతి వివాహావిధిః సమాప్తః

## లింగధారణ విధి క్రమం

వీరశైవుల యింటియందు శిశువుపుట్టిన ... దవదినములో శివపూజా గృహములో గోమయముతో శుద్ధిచేసి గురుగద్దెగె వీఠ మును సిద్ధపరచి అన్ని పూజాసామానులును పెట్టుకొని గురువును పిలు చుకొనివచ్చి గద్దెగెమీద కూర్చుండబెట్టి గురువుయొక్క పాదార్చన చేసుకొనవలెను. ఆపాదోదకమును ఆ ఇంటియొక్క అన్ని ప్రదేశము లకు సంప్రోక్షించి ధారణముచేసి లింగముపైనవేసి ఆ లింగపీఠము కద లకుండ దారమునుకట్టి గురుగద్దెగెమీద పెట్టుకొని యుండవలెను. పిమ్మట గురువుయొక్క కుడిప్రక్కస్థళములో బియ్యమువేసి దాని మీద ఒక కలశమును స్థాపనమునుచేసి ఆ కలశమునకు సూతికాగృ హములో బిడ్డయుండిన స్థానమునకు సూత్రదారమును యుంచవలెను. అనంతరము ఆ బిడ్డయొక్క తండ్రిగాని యితర బంధువులుగాని వచ్చి గురువునకు సాష్టాంగ నమస్కారము చేసి గురుసమ్ముఖములో కూర్చొ నవలెను పిమ్మట పురోహితుడు కలశమునుపూజించి 108 సార్లు పంచాక్షరీమంత్రమును జపించవలెను. ఆలింగమును వామహస్తములో ఉంచుకొని యీ క్రిందచెప్పినప్రకారము పంచామృతములతో 5 సార్లు అభిషేకముచేసి భస్మగంధ పత్రపుష్పాదులతో పూజచేయువలెను.

### పంచామృతాభిషేక క్రమం

ఒక పాత్రయందు గోక్షీర గోదధి గోఘృత తేనె చక్కెర ఈ పామానులనుకలిపి యీ మంత్రముతో అభిషేకంచేయువలెను.

అభిషేక మంత్రం:— పయః పృథివ్యాం పయఓషధీషు ॥ పయోధి వ్యంతరిక్షేపయోధాః ॥ ప్రదిశఃసంతుమహ్యాం ఇతిమంత్ర పంచా మృతేనఅభిషేకం కరోమి । ఈ పంచామృత అభిషేకము చేసినపిమ్మట ఈ మంత్రముతో శుద్ధోదక అభిషేకము చేయువలెను.

శుద్ధోదక మంత్రం:... గంగాసాగర నర్మదాచ యమునీగోదా వరీగోమతీ తుంగాద్వార గయాప్రయాగబదరీ వారణాసీ సైంధవీః। కన్యాసేతు సరస్వతీ ప్రభృతయో బ్రహ్మాండ మధ్యాఖిలం తీర్థస్నా న సహస్రకోటిఫలదం శ్రీ శంభు పాదోదకం ॥ ఇతి మంత్రేణ శుద్ధోదకంస్నాపయామి ॥

ఈ మంత్రముతో అభిషేకముచేసి భస్మగంధ అక్షతాపత్రి ధూపదీప నైవేద్య తాంబూలం వీటిత్రో శివపూజావిధిలో చెప్పిన మంత్రముతో 5 సార్లు పూజించవలెను. పిమ్మటలింగమును పవిత్రమైన వస్త్రముతో కట్టివుంచి అనంతరము ఆబిడ్డను సూత్రముతో గురువుదగ్గరకు తీసుకొనిగావలెను.

గురువు ఆ బిడ్డమీద పాదోదక పంచగవ్యాదులును సంప్రోక్షించి అ బిడ్డయొక్క ఫణికి భస్మముపెట్టి ఆ బిడ్డయొక్క రెండు చెవులలో పంచాక్షరీ మహామంత్రమును పఠించి ఈక్రిందచెప్పిన మంత్రముతో బిడ్డకు లింగధారణము చేయావలెను.

మంత్రం:—ఓం శివలింగధారయంతి తస్మాద్దేవా శివలింగధారయంతి ॥ యూపై శివలింగధారణం కుర్యాత్ । అజహరిముఖా శ్శివలింగంధారయంతి సురేంద్రాః దైత్యాః శివలింగం ధారయంతి ఓం నమోబ్రహ్మణే లింగధారణం వేలస్మిన్నిరా కరణేధాం యేత్రాభూయాస్సంకర్ణ యోశ్రుతం। మాభూర్ధ్యంమేమాయు వ్యం ఇత్యనేనమంత్రేణ శిశోః కంఠే శివలింగంధారయేత్ ॥

ఈ మంత్రముతో బిడ్డకులింగధారణముచేసినపిమ్మట గురుపాదపూజచేసుకొని ఆబిడ్డకు పాదోదకమునిచ్చి ఆశీర్వచనము తీసుకొని భోజనము చేయావలెను.

లింగధారణవిధి సమాప్తః

—: వీరశైవ దీక్షావిధి క్రమం :—

వీరశైవ మహేశ్వర బాలకులకు, పుట్టిన 8 వ వర్షమునుండి 16 వర్షములోగా మహేశ్వరదీక్షా (అయ్యాచార) చేయవలసినది. బాలకులకు నేత్రము, చెవులు, మొదలైన అంగవైకల్యముఉండిన ఆబాలకులకు దీక్షచేయకూడదు. మఠములో దీక్షామంటపమును అలంకారముగానిర్మించి గోమయముతో ఆలకించి పంచకలశములనుస్థాపించి కలశములో పంచాక్షరములనువ్రాసి గురుగద్దుగెయొక్క కుడిప్రక్కన నిరంజనగాంగేయ కలశమునుస్థాపించి దానిలో ఓం ప్రణవమునువ్రాసి అనంతరము కలశములను శివసూత్రమునువేసి కలశము

తో పాదోదక మిశ్రీమైననీళ్లుపోసి అలంకారము చేసి రత్నములను వేసి ఆకలశములను విధిప్రకారముగా పూజించి క్రొత్తవస్త్రములతో పర దాను కట్టివుంచవలెను. కలశములమీదక్రొత్తవస్త్రము వేసి అనం తరము బాలకుని గురుసన్నిధికి పిలుచుకొనివచ్చి ముంభాగములో కూ ర్చుండబెట్టి గురువు బాలకునియొక్క రెండుహస్తములయందు ధర్భ వుంగరమునుకట్టిన సూత్రిమును వేసి మొదటిబాలకునియొక్క హస్త, పూజా, మస్తకపూజా అనంతరము లింగపూజను విధిప్రకారము గా హస్తములకు ౭, మస్తకమునకు ౭, లింగమునకు ౭, పూజలును ౧౧, పా త్రలో వేసిన పధార్థములతో ఈ క్రింద వ్రాసిన ఆయాయా మంత్రిము లతో పూజించవలెను.

## ౧ పాద్య మంత్రిం

పాద్యద్రివ్యములు:— తెల్ల ఆవాలు, కుంకుమ, కేసరి, గరక, కోష్ట లావంచ, పచ్చకర్పూరం ఈ ౬ పధార్థములను ఒక పాత్రలో నీళ్ళువేసి ఈ మంత్రిముతో పాద్యమును లింగముమీద ధారగా వేయవలెను. మంత్రిం:—యద్భక్తిలేశ సంపర్కాత్పర మానందసంభవః। తస్మైతే చరణాబ్జయాపాద్యం శుద్ధాయ కల్పయే॥ ఇతిపాద్యం స్నాపయామి ఈ మంత్రిముతో పాద్యం వేయవలెను.

## అర్ఘ్య మంత్రిం

అర్ఘ్య ద్రవ్యములు— దర్భ, నువ్వులు. యువగోధుమలు, వ డ్లు. అవుపాలు, తెల్ల సానువ— ఈ ౬ పదార్థములు ఒక పాత్రిలో నీళ్ళ సహితం వేసి ఈ మంత్రముతో అర్ఘ్యం వేయ వలెను.

మంత్రి— తాపత్రియ హరే దివ్యం। పరమానంద లక్షణం తాపత్రియ వినిర్ముక్త్యైతవార్ఘ్యం కల్పయామ్యహం। ఇత్యర్ఘ్యన స్నాపయామి.

## 3 ఆచమాన మంత్రం

అచమాన ద్రివ్యములు—జాజికాయ, ఖచూరం.పచ్చకర్పూ గం కొష్ట—కుంకుమ. కేసరి, యాలకులు ఈ పదార్థములను కప్పా

త్రిలో నీళ్ళు సహితం వేసి ఈ మంత్రంముతో ఆచమనమును చేయవలెను.

మంత్రం—వేదానామపి - వేదాయ - దేవానాం దేవతాత్మనే ఆచమ్యం కల్పయామీశ శుద్ధానాం శుద్ధిహేతవే ॥ ఇతి ఆచమనం సమర్పయామి.

## ౪ మధుపర్క మంత్రం

మధుపర్క ద్రవ్యములు— గోక్షీర, గోదధి, గోఘృతం, తేనె ఈ ౪ పదార్థములను ఒక పాత్రిలోనీళ్ళ సహితం వేసి ఈ మంత్రిముతో మధుపర్కం వేయవలయును.

మంత్రిం—సర్వకాలుష్యహీనాయ పరిపూర్ణశుచాత్మనే। మధుపర్కం మహాదేవ కల్పయామి ప్రసీద మే॥ ఇతి మధుపర్కేణ స్నాపయామి.

## ౫ మిశ్రపంచామృతమంత్రి

మిశ్రిపంచామృత ద్రివ్యములు— గోక్షీరంగోదధి, గోఘృతం తేనె, చక్కెర ఈ పదార్థములను ఒకపాత్రిలో నీళ్ళు సహితం వేసి ఈ మంతిముతో మిశ్రపంచామృతం చేయవలయును.

మంత్రిం—పయః పృథివ్యాం పయఓషధీషు - పయోదివ్యంతరిక్షే పయోధాః ప్రదిశః సంతుమహ్యం॥ ఇతి మిశ్రిపంచామృతేన స్నాపయామి.

## ౬ భస్మోదక మంత్రిం

ఒకపాత్రిలో నీళ్ళు భస్మమును కలిపి ఈ మంత్రముతో భస్మోదకమును చేయవలయును.

మంత్రం—త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనం ఉర్వా

ద్యుత ముదబంధ నాన్మృత్యో ర్ముక్షీయ మామృతాత్॥

౭ గంధోదక మంత్రం

గంధోదక క్రమం— ఒక పాత్రలో నీళ్ళు గంధము వేసి ఈ మంత్రముతో గంధోదకమును వేయవలయును.

మంత్రం— తదేవ శుక్రమమృతం తద్బ్రహ్మ తదాపః। స ప్రజాపతిః స్వశైని మేపాజి జ్ఞ రేవిద్యుతః। పురుషా అధిలాము హూర్తాది ఓ ప్రాశ్వాసర్వశః। ఇతి గంధోదకేనస్నాపయామి.

౮ పుష్పోదక మంత్రం

పుష్పోదక క్రమం— ఒక పాత్రలో నీళ్ళు కమల పుష్పముగాని లేక ఇతర పుష్పములనుగాని వేసి యీమంత్రముతో పుష్పోదకమును వేయవలయును

మంత్రం ॥ యః ఫలా నీర్యా ఆఫలా అప్టాయాశ్చపుష్పిణీ బృహస్పతి పసూ తాస్తానో మంచం త్వీజ్ఞ వానః॥ ఇతి పుష్పోదకేన స్నాపయామి.

౯ స్వర్ణోదక మంత్రం

స్వర్ణోదక క్రమం— ఒక పాత్రలో నీళ్ళు బంగారుయుంగరము ను వేసి ఈ మంత్రముతో స్వర్ణోదకమును వేయవలయును.

మంత్రం। ఋతం సత్యం పరం బ్రహ్మపురుషం కృష్ణపింగళం। ఊర్ధ్వరేతం – విరూపాక్షం – విశ్వరూపాయ వై నమోనమః॥ ఇతి స్వర్ణోదకేన స్నాపయామి.

౧౦. రత్నోదక మంత్రం

రత్నోదక క్రమం। ఒక పాత్రలో నీళ్ళు, ముత్య ఉంగరము వేసి ఈ మంత్రముతో రత్నోదకమును చేయవలయును.

మంత్రం— సనారత్నాని వాసు షేన్మనాతి – సవితాభాగః తం భగం చిత్రమీమహే। ఇతి రత్నోదకేన స్నాపయామి.

౧౧ మంత్రోదక మంత్రం

మంత్రోదక క్రమం - ఒక పాత్రలో పాదోదకమును వేసుకొని ఈ మంత్రముతో వేయవలయును,

మంత్రం—తగత్సమాంధి ధానతి - ఇతి మూలేసచ శ్రీపంచాయనమః ఏ... చెప్పిన ... చెప్పిన తర్వాత" మా

శివ శుద్ధోదకేనస్నాపయామి." దీనిని చెప్పుచు శుద్ధోదకమును చేయుచుండవలెను. ఈ ప్రకారముగా లింగమునకు 1[1] పాత్రలనుంచి అభిషేకము చేసిన పిమ్మట భస్మగంధ అక్షతా, పత్రధూప దీప నైవేద్య తాంబూలాదులనుంచి శివపూజా విధిలో చెప్పిన ప్రకారంపూజింపవలెను. అనంతరం గురువు తనయొక్క కుడి హస్తమును శిష్యునితలమీద పెట్టి చెవిలో పంచాక్షర మంత్రమును చెప్పవలెయును తిరువాత శిష్యుకి పాదతీర్థమును ఇచ్చి దర్భతో కట్టిన కంకణమును ముంజేతికి కట్టిన జోళిని బెత్తమును ఇవ్వవలయును శిష్యుడు కార్యమునకు వచ్చియున్న భక్తమహాశయులనుండి భిక్షము చేసి వచ్చిన కానుకను గురువుకు ఇచ్చి నమస్కారము చేయవలయును ఈ దీక్షాకార్యము పూర్తిచేసిన పిమ్మట గణారాధన చేయవలయును.

— దీక్షావిధి సమాప్తము —

## శ్రీ రుద్రాభిషేకమును సులభముగా చేయు క్రమం

ప్రతి ఒక్కరు తనయొక్క ఇండ్లయందుగాని శ్రీ ఈశ్వర దేవాలయమునందుగాని, రుద్రాభిషేకమును చేయవలసినచో సుష్టందున దేవాలయ ప్రదేశము మంగళకరముగా తయారుచేయించి దగ్గర అన్ని పూజాపదార్థములను సిద్ధపరచి పెట్టిపుంచి దీక్షావిధిలో చెప్పిన ప్రకారము అర్ఘ్యపాద్యమధుపర్క-మిశ్రి పంచామృత ఆచమాన మృత భస్మోదక గంధోదక పుష్పోదక స్వర్ణోదక రత్నోదక మంత్రోదక ఈ పదకొండు అభిషేకములను ౧౧ పాత్రలో ఉదకము వేశ ఆయాయ అభిషేకములో చెప్పిన పదార్థములో వేసి సిద్ధపరచి పెట్టుకొని ఆయాయా పదంతులలో అభిషేకము అనంతరము శుద్ధోదములో శివపూజా విధిలో చెప్పినప్రకారము అభిషేక భస్మగంధ అక్షతా బిల్వపత్రి ధూపదీప కర్పూరం నైవేద్య తాంబూల పుష్పాంజలి మొదలగు ఆయాయామంత్రములతో తమతమ కోరికప్రకారం ఒకసారిగాని, పదకొండుసార్లుగాని అభిషే. పూజాదులును చేసి రుద్రాభిషేకమును ముగించి తమ యోగ్యతప్రకారం అన్నసంతరమును చేయవలెను.